# అథ సప్తదశో%ధ్యాయః

# శివుని దశావతారములు

శృణ్వథో గిరిశస్యాద్యావతారాన్ దశసంఖ్యకాన్ | మహాకాలముఖాన్ భక్త్యోపాసనాకాండసేవితాన్ || 1

తత్రాద్యో హి మహాకాలో భుక్తి ముక్తి ప్రదస్సతామ్ | శక్తిస్తత్రమహాకాలీ భ##క్తేప్సితఫలప్రదా || 2

తారనామా ద్వితీయశ్చ తారా శక్తి స్తథైవ సా | భుక్తిముక్తి ప్రదౌ చోభౌ స్వసేవక సుఖప్రదౌ || 3

భువనేశో హి బాలాహ్వస్తృతీయః పరికీర్తితః | భువనేశీ శివా తత్ర బాలాహ్వ సుఖదా సతామ్ || 4

శ్రీవిద్యేశష్షోడశాహ్వశ్శ్రీవిద్యా షోడశీ శివా | చతుర్థో భక్త సుఖదో భుక్తి ముక్తి ఫలప్రదః || 5

పంచమో భైరవః ఖ్యాత స్సర్వదా భక్తకామదః | భైరవీ గిరిజా తత్ర సదుపాసక కామదా || 6

ఛిన్నమస్తకనామాసౌ శివష్షష్ఠః ప్రకీర్తితః | భక్త కామప్రదా చైవ గిరజా ఛిన్నమస్తకా || 7

ఉపాసనాకాండద్వారా సేవింపబడే, మహాకాల మొదలగు పది శివుని అవతారములను గూర్చి ఇపుడు భక్తితో వినుము (1). సత్పురుషులకు భుక్తిని, ముక్తిని ఇచ్చే మహాకాలావతారము వాటిలో మొదటిది. అపుడు శక్తి మహాకాలియై భక్తులకు ఫలములనిచ్చి కోర్కెలనీడేర్చును (2). 'తార' అను అవతారము రెండవది. దానియందు శక్తి 'తారా' యనబడును. వీరిద్దరు తమ సేవకులకు భుక్తిని ముక్తిని, సుఖమును ఇచ్చెదరు (3). బాలభువనేశుడు మూడవ అవతారము. ఆ అవతారములో పార్వతి బాలభువనేశ్వరియై సత్పురుషులకు సుఖమునిచ్చును (4). భక్తులకు భుక్తిని, ముక్తిని, సుఖమును, ఫలమును ఇచ్చే షోడశ

శ్రీవిద్యేశుడు నాల్గవ అవతారము. దానిలో పార్వతి షోడశీ శ్రీవిద్యాదేవి యగును (5). సర్వకాలములలో భక్తుల కోర్కెల నీడేర్చు భైరవుడు ప్రసిద్ధిగాంచిన అయిదవ అవతారము. దానియందు పార్వతి భైరవియై మంచి ఉపాసకుల కోర్కెలనీడేర్చును (6). శివుని ఆరవ అవతారమునకు ఛిన్నమస్తకుడని పేరు. గిరిజాదేవి ఛిన్నమస్తకయై భక్తుల కోర్కెల నీడేర్చును (7).

ధూమవాన్ సప్తమశ్శంభుస్సర్వకామఫలప్రదః | ధూమవతీ శివా తత్ర సదుపాసక కామదా || 8

శివావతారస్సుఖదో హ్యష్టమో బగలాముఖః | శక్తిస్తత్ర మహానందా విఖ్యాతా బగలాముఖీ || 9

శివావతారో మాతంగో నవమః పరికీర్తితః | మాతంగీ తత్ర శర్వాణీ సర్వకామఫలప్రదా || 10

దశమః కమలశ్శంభు ర్భుక్తి ముక్తి ఫలప్రదః | కమలా గిరిజా తత్ర స్వభక్తపరిపాలినీ || 11

ఏతే దశమితాశ్శైవా అవతారాస్సుఖప్రదాః || భుక్తి ముక్తి ప్రదాశ్చైవ భక్తానాం సర్వదాస్సతామ్ || 12

ఏతే దశావతారా హి శంకరస్య మహాత్మనః | నానాసుఖప్రదా నిత్యం సేవతాం నిర్వికారతః || 13

ఏతద్దశావతారాణాం మాహాత్మ్యం వర్ణితం మునే | సర్వకామప్రదం జ్ఞేయం తంత్రశాస్త్రాది గర్భితమ్ || 14

సర్వకామనలనీడేర్చి ఫలములనిచ్చే ధూమవంతుడు శివుని ఏడవ అవతారము. ఆ అవతారములో పార్వతి ధూమావతియై సత్పురుషులగు ఉపాసకుల కోర్కెలనీడేర్చును (8). సుఖమునిచ్చు బగలాముఖుడు ఎనిమిదవ శివావతారము. దానిలో శక్తి మహానందా, బగలాముఖీ యను పేర్లతో ఖ్యాతిని పొందును (9). తొమ్మిదవ శివావతారము మాతంగుడు. దానిలో పార్వతి

మాతంగియై సర్వకామనల నీడేర్చును (10). భుక్తిని ముక్తిని ఇచ్చే కమలుడు శంభుని పదియవ అవతారము. దానిలో పార్వతి కమలయై తన భక్తులను రక్షించును (11). ఈ పది శివావతారములు సత్పురుషులగు భక్తులకు సుఖమును, భుక్తిని, ముక్తిని, సర్వమును ఇచ్చును (12). మహాత్ముడగు శంకరుని ఈ పది అవతారములను వికారములు లేకుండగా నిత్యము సేవించువారికి అనేక సుఖములు లభించును (13). ఓ మహర్షీ! తంత్ర శాస్త్రము మొదలగు వాటియందు నిగూఢముగా నున్న ఈ పది అవతారముల మహిమను వర్ణించితిని. ఈ వర్ణన కోర్కెల నన్నిటిని ఈడేర్చునని యెరుంగవలెను (14).

ఏతాసామపి శక్తీనామద్భుతో మహిమా మునే | సర్వకామప్రదో జ్ఞేయ స్తంత్రశాస్త్రాది గర్భితః || 15

శత్రుమారణకార్యాదౌ తత్తచ్ఛక్తిః పరా మతా | ఖలదండకరీ నిత్యం బ్రహ్మతేజో వివర్ధినీ || 16

ఇత్యుక్తాస్తే మయా బ్రహ్మన్నవతారా మహేశితుః | సశక్తికా దశమితా మహాకాలముఖాశ్శుభాః || 17

శైవపర్వేషు సర్వేషు యో%ధీతే భక్తి తత్పరః | ఏతదాఖ్యానమమలం సో%తి శంభుప్రియో భ##వేత్ || 18

బ్రాహ్మణో బ్రహ్మవర్చస్వీ క్షత్రియో విజయీ భ##వేత్ | ధనాధిపో హి వైశ్య స్స్యాచ్ఛూద్రస్సుఖమవాప్నుయాత్ || 19

శాంకరం నిజధర్మస్థాశ్శృణ్వంతశ్చరితం త్విదమ్ | సుఖినస్స్యుర్విశేషేణ శివభక్తా భవంతు చ || 20

ఇతి శ్రీ శివమహాపురాణ శతరుద్రసంహితాయాం శివదశావతావతార వర్ణనం నామ సప్తదశో%ధ్యాయః (17).

ఓ మహర్షీ! తంత్ర శాస్త్రాదులలో నిగూఢముగా నున్న ఈ శక్తుల మహిమ అద్భుతము, కోర్కెలనన్నిటినీ ఈడేర్చునది అని తెలియవలెను (15). ఆ యాశక్తులు శత్రు సంహారము మొదలగు

వాటిలో శ్రేష్ఠఫలము నిచ్చుననియు, దుష్టులను శిక్షించి నిత్యము బ్రహ్మవర్చస్సును వృద్ధి పొందించుననియు చెప్పబడినది (16). ఓ బ్రాహ్మణా! శక్తితో గూడినవి, శుభకరమైనవి అగు మహాకాలాది పది మహేశ్వరావతారములను నేను నీకు చెప్పితిని. (17). ఎవడైతే, భక్తి తత్పరుడై శైవపర్వదినములన్నిటి యందు ఈ పవిత్రమగు గాథను పఠించునో, వాడు శంభునకు మిక్కిలి ప్రియుడగును (18). బ్రాహ్మణుడు బ్రహ్మవర్చస్సు గలవాడగును. క్షత్రియుడు వినయమును పొందును. వైశ్యుడు ధనాఢ్యుడగును. శూద్రుడు సుఖమును పొందును (19). శివభక్తులు తమ ధర్మమును పాటిస్తూ ఈ చరితమును వినుచున్నచో విశేషసుఖమును పొందెదరు. వారి భక్తి వర్ధిల్లును (20).

శ్రీ శివ మహాపురాణములోని శతరుద్రసంహితయందు శివదశావతారవర్ణనమనే పదిహేడవ అధ్యాయము ముగిసినది (17).